చును మది నమ్మియుండె నల
సుందరి నిష్కపటానురాగగాన్.

అనురాగాంబుధి పెల్లున న్మునిఁగి
మోహాంధుండు వారాంగనన్
గని యెన్నండును నిట్టిసాహసములన్
గావింప నేనంచు న
చ్చిన ప్రేమంబున బాసచేయుమనినన్
జిన్నారి లేనవ్వు మో
మునకున్ వింతమెఱుంగు వెట్టఁ
బడపుఁబూఁబోఁడి తా నిట్లనున్.

సరసాగ్రేసర చక్రవర్తివగు నీ
సౌందర్యమూహింప సుం
దర నారీజన చిత్తవిత్తహరణో
ద్యత్ప్రౌఢ మౌఁగాన సు
స్థిరబుద్ధిన్ నినుఁ బాయ నెన్నఁడనుచున్
జేఁజేయిడన్ జాలుదే
ని రహిన్ స్వాంతము చిక్కఁబట్టుగొనఁగా
నేనొప్పుదున్ నావుడున్.

ఆనెలఁత పలుకు లమృతపు
సోనలవలె వీనుదోయి సోగయింపఁగ బ్ర
హ్మానందంబునఁ బొంగుచు
నా నట్టులె కాక చెలువయాన యిడుమనన్.

సఖుఁడ! మున్ను నీవె శపథంబు సేయఁగా
వలయుననుచుఁ బలుకు వారకాంత;
యీప్రశంస మున్న యేఁ దెచ్చితినిగాన
రమణి నీవె యనును రత్నవర్మ.

పొలయలుక నిష్ఠురంబుల
పలుకుల నోనాడుటలను బట్టింపులచే
బలవంతముగాఁ దుదకా
నెలఁతయు రమణుండు నొక్క నియమముగాఁగన్.

ఇరువురొక్కసారి యేకవాక్యంబుగా
శపథ మాచరింప సమ్మతించి
యొకరి శిరమునందు నొక్కరిహస్తంబు
నొకరిచేతిలో నొకరిచేయి.

చేరిచికొని యామాయల
మారియయిన రూపణిక యమాయికసరసుం
డారత్నవర్మయును నీ
తీరున శపథంబు తెలుఁగుఁ దెలిపిరొకమొగిన్.

"మేనులు వేఱై యుండినఁ
బ్రాణంబొక్కటిగ తలఁపుఁబడి యొక్కటిగా
నీనాభేదముఁబోనిడి
యానందించుదముగాక" యని యొండొరువుల్.

ప్రతినసేయ, రత్నవర్మ చిక్కెనుగదా
యనెడు సంతసంబు నాటవెలఁది

కా నెలంత దక్కెనను ప్రమోదము రత్న
వర్ష కొక్కమాఱె ప్రభవ మయ్యె.

అదిమొద లాగయాళి నగ
లంచును, నాణెములంచుఁ, గట్టఁగాఁ
బెదపెద చీరలంచు, నిరు
పేదల కిచ్చుట కంచు నిండుప
ర్వదినము లంచు వెచ్చములు
వాడితి నంచు నెపంబువెట్టి నే
ర్పొదవ ధనంబు దోఁచుకొను
చుండెను వెంగలిఁ జేసి యాతనిన్.

శ్రావణ శుక్రవారము వచ్చెఁ గట్టుకా
సులపేరుపైఁ బూజసలుపవలయు
నవరాత్రములు వచ్చె నగరాజపుత్త్రిక
నిల్పి యుత్సవములు నెరపవలయుఁ
గార్తికనవసుధాకరవార మిది పేద
దంపతులనుగూర్చి తనుపవలయు
మకరసంక్రాంతిని మనకున్నయంతలో
పేదసాదలకిచ్చి మోదవలయు
ననుచు నెఱజాణతనమున నతనిఁ జెంత
బ్రతిదినంబును నిదియొక పర్వమనుచుఁ
గల్పనముచేసి ముదుసలి గడనకత్తె
దినము నాలువరాలైనఁ గొనుచునుండు.

ఆమూఢుండు ధనాంగనావశతనుండై
యేమివాంఛించినన్
క్షేమందెచ్చి యొసంగుఁగాని
తుదకీ విత్తంబు పోవంగఁ దా
నేమియ్యంగల నప్పు డెట్టులని
యూహింపం డొకింతైననా
హా! మోహాంధుఁడు జ్ఞానశూన్యుఁడయి
యుక్తాయుక్తముల్ గాంచునే!

ఇటు లావారవధూలలామ గృహామం
దెల్లప్పుడున్ నిల్చి దు
ర్విటుఁడై విత్తము దోఁచియీయఁగ
నయారే! దుష్టసంచారలం
పటుఁడౌ నీతనిచేత రాజ్యరమ
క్షిప్రంబే నశించుంగదా
యెటులంచున్ దలపోసి మంత్రులొకటై
యేకాంత మార్గంబునన్.

సుహృదులార! మనము చూచుచు నూరక
యుంటిమేని యాతఁడొక్కనెలకె
రాజ్యమెల్ల వారరమణికిఁ జేరుచు
నామహానుభావుఁ డాడినట్లు.

దానితోడిదలోకంబు దానిపలుకె
శాసనముగాఁగ గ్రహియించి సాధ్వియైన

కులసతి నెడల్చినట్టి యా కుటిలమతికి
నతనికి రాజ్యమొకలెక్క యగునె చెప్పుడ?

కావున నాతఁడెట్టి యధి
కారముగల్గిన నేమి సేయుఁ "నీ
వీవిధి నీచవృత్తిఁ దగవేది
చరించెదు నంతకాలముఁ
భూవరుఁడయ్యెదే వెడలి పొ"
మ్మనుచుం దెరలించి సాధుమ
ద్భావములొందుత నమ్మనమె
పాలనసేయఁదగుఁ గ్రమంబునన్.

మాయావతు లగువారా
బ్జాయతలోచనలు ధనము నాసించిన వా
రే యగుట నప్పుడాతని
రోయుదు రొకయించుకైన రో యిడలేమిన్.

తనయంతఁ దా వివేకం
బును బొందుచు నప్పు డతఁడు మునుకొని వారాం
గన దుశ్చారిత్రంబును
మననము సేయుటనె బుద్ధిమంతుండగుతన్.

అప్పుడతనిరాజ్యమాతని కొప్పించి
బరువు దింపికొనఁగవచ్చు మనకు
నమలసచ్చరిత్ర ననురూప ననురూప
యనుచు నప్పుడేలికొనఁగలండు.

కాకున్న నింతలోపల
నాకుటిలాలకల కృత్రిమాపాంగంబుల్
తాఁకి మతిచెడినయాతం
డాకొనునే మనము పలుకు నుచితవచనముల్?

అని యాతం డరుదేరకుండఁగనె కో
శాధ్యక్షునిం బిల్చి యా
తనికిం గట్టడఁజేసి యున్నతఁడె ని
త్యంబిచ్చు విత్తంబులన్
గొనిపోవచ్చిన రత్నవర్మఁ గని యా
కోశాధినాథుండు లే
దనినన్ గోపములో నదల్చుచును "నౌ
రా! యింతదుర్గర్వమే!

భయములేక యిట్లు పలుకునీసాహస
మెవనివలనఁ గలిగె నెఱుఁగఁజెప్పు"
మనుచు ధిక్కరించి చని క్రోధమూర్తియై
కొలువుకూటమునను గలయఁజూచి

తనమంత్రి వరులపైఁ గనలి "స్వామిద్రోహ
చింతాపరాయణ చిత్తులార!
మిము నమ్మి యెల్లరాజ్యము నొప్పగించిన
ననుఁ ద్రోసిరాజు చేయన తలంచి

కృత్రిమం బూనితిరే" యని యదలింప
వారు "నోవిటరాజ! భాగ్యమనుచుఁ

దలఁపవుగా యిట్లు తగవేది చరియించు
నెడ నిచ్చమైనిన్ను విడుచు నెల్ల
నవనినాయకుఁ డవినీతుఁడైనఁ బ్రజలు
విశ్వసించెదరే? యిట్టి వెఱ్ఱియేల?
అయ్యొ! చేఁజేతఁ దెచ్చికొన్నట్టియిడుము
ననుభవింపక తప్పునే మనుజులకును.

నాఁవుడు రత్నవర్మ వద
నంబున విన్నదనంబు దోఁపఁగాఁ
జేవఁ దొలంగి వారియెడఁ
జేయునదెద్దియు లేక దీనతన్
దైవముచేఁత కెంతయును
దా దురపిల్లుచు వారివీడి వే
శ్యావపథంబె దిక్కుగ మ
హార్త్రిని బోవుచు నెమ్మనంబునన్.

ఇచ్చకు వచ్చినట్టులు వ్య
యింపకయుండఁగ మంత్రులెల్ల న
న్నిచ్చటినుండి త్రోసి తమ
యిచ్చతెలుంగున రాజ్యమేలుచున్
గ్రచ్చరనాకుఁగల్గు నధి
కారము లన్నియుఁ దీసివైచి రే
నచ్చటికేగి యెట్లుముద
మందఁగ నేర్తు? విచారమయ్యెడిన్.

రూపణిక కోరదెన్నఁడు రూకమైన
బోసి పులిలాగు ధనరూప బైసిమాలి
చీటికిని మాటికిని నన్నుఁ జేరవచ్చి
యాపనియు నీపనియుఁ జెప్పి యనుదినంబు.

డబ్బు దస్కంబు లాగి తబ్బిబ్బు సేయుఁ
గలిగినన్నాళ్లు లావృద్ధకామినికిని
దోఁచిపెట్టితి నిపుడేమి తోఁచకుండె
హీనమగుఁగాదె ద్రవ్యంబు లేనిబ్రతుకు!
ఎట్టులైన ధనము నీయక తక్కిన
ముసలిముండ లోన విసుగుకొనును
దానిఁ దృప్తిపఱుప నేని మున్నింటి నా
గొప్పతనమునకును గొఱంతగాదె?

ఎన్ని విధంబులఁ జూచిన
సొన్నాటంకములు లేనిచో రూపణికన్
గన్నెత్తి చూడఁ జాలను
మున్ని చ్చెడివాఁడ నురక బోవఁగఁగలనే!
అని యీాగతి మొగమోటం
బున మనుజాధిపుఁడు దాని పొత్తున కెట్లో
చనుఁగాని మనసుతృప్తిగ
మునువలె మాట్లాడఁబోఁడు ముగ్ధుఁడువోలెన్.

రత్నవర్మ విత్తంబులో రాజ్యమెల్లఁ
బరులపా లయ్యెనంచు రూపణిక యెఱిఁగి

యదిమొదలు వాని మునుపటి యట్లు గనక
యెట్టులైనను నిలువెళ్ళఁగొట్టనెంచి.
ఇంతకుమున్న యెందఱినో
యిట్టులె చేరఁగఁదీసి నేర్పునన్
దొంతరగా సమస్తమును
దోఁచి విరాగులఁ జేసి నిర్దయ
స్వాంతముతోడ నిల్వెడల
నంపిన గద్దరితల్లిగాంచినీ
వం తిఁక సాగనిమ్ము మన
వాడప శంతులు మెచ్చునట్లునన్.

రత్నవర్మకు గుండెలో రాయివోలి
హైసరే యని చంకలు వేసికొనుచు
విటజన వ్రాతజీమూత చటులవాత
వికృత గుణజాత యరుదెంచె వేశ్యమాత.

వచ్చి, వాడసతులపై నెపంబిడి వీని
నిచ్చవచ్చినట్టు లెల్లనాడి
వెలువరింతు ననుచుఁ దలపోసి యాతని
డాయనేగి యనియెఁ డక్కులాడి.

ఏమిజామాత! మనవాడ భామలెల్లఁ
బందుగులు పబ్బములు జేయుచుండి రిప్పుడు
గ్రామదేవత జాతర గాన నేఁడు
మనము నూరక యుండుట మంచిదగునె?

నాన బూని తేమి నా వెండికొండ! నన్
గాంచ వేమి నాదు కాంచనంబ!
పలుక వేమినాదు బంగారు చిల్క! నీ
మాద్రి నేఁడు వింతమాద్రియయ్యె.

బిసిబిసిపల్కులె కానీ
పిసిఁడితనంబబ్బె నీకుఁ బెఱుచోటుల నీ
గుసగుస లేనెఱిఁగితి నీ
ముసిముసినగవేల నన్ను మోసము సేయన్.

మాటలిచట ధనపు మూట లాతావున
బొందె యిచట మనసు పొందులచట
నెఱుఁగవచ్చెఁ గల్లలెల్లను నాకడ
డాఁప నేల? వెఱ్ఱి భూపతనయ!
అనఁగ విన్నఁబోయి యగునగు సరిపోయె
నెచట నేర్చికొంటి విట్టిమాట
లకట! రత్నవర్మ యారూపణికఁ గాక
యన్యఁ గోరునట్టి యధముఁ డగునె?
రూపణికయె నాదు ప్రోపును ప్రాపును
రూపణికయె నాదు రూపు చూపు
కల్లబొల్లి మాటలల్లి యీరీతిని
నన్నుఁ దూలనాడ న్యాయమె? యన.

"టక్కు పిక్కుఁజేసి డబ్బు డబ్బెదవేల?
యిట్టి బొంకులెల్ల నేమెఱుఁగమె?

జార! కాసులిచ్చి యాకురంగాక్షితో
మాటలాడుమాట మఱచితోకో!

నిన్న మొన్ననెకదా కన్నెరికముచేసి
తా కళావతికి వేరూకలిచ్చి
వెండికోరం గిరవెట్టి దానిమొగాన
నా హేమలతఁ గూడి యాడలేదె?
లడ్డులాడులు బంపి వడ్డివీథిని నున్న
మంజువాణి గృహంబు మఱగలేదె?

పసమించి మేల్ బణారసు చీరలనుబంపి
యలచంద్రరేఖతోఁ గులుకలేదె?
ఈవు చెప్పకయున్నచో నెఱుఁగదాదె?
పిల్లి కనుమూసి పాల్ దావువేళఁ దన్ను
నొరులు గనరనుకొనునఁట! యో వెడంగ!
యెడనేర్చితి వీబొంకులాడుతనము?
ఇట మఱగియె కావలె న
క్కట! యాధన మెల్ల వారకాంతల కిడి మ
మ్మటుమట జేయుచు నరచే
నిటువలె మోక్షంబుఁ జూపి తేమని యందుఁ."

నావుడు దబ్బరలాడఁగ
నో వెలఁదుక లాభమేమి యో? తలపోయన్
నీవిటు మాయావతివై
నావనుటిపు డెఱుఁగవచ్చెనా నెమ్మదికిఁ.

నావిని "యోరి! యేమనెదు?
నన్నడకించుట వోయెనే? యిదే
లా వెడపోల్క? నన్నె కుటి
లాత్మికఁ జేసితి వళ్కుమాని, నీ
భావము వేఱుచెందెఁ బెఱ
భామలఁ గూడుటఁ జేసి, యింక నీ
సేవలె చేయుచుండిన ని
సీ! నగరా నగరాన నల్వురుఁ?

ప్రియ మెడలియున్న నీతోఁ
బ్రియమున రూపణిక వెఱ్ఱిపిల్ల యగుటఁ జె
ల్మి యొనర్చుచుండె నకటా!
నయమున నిటు కన్నుఁ గప్పినాఁడవు కాదే.

మనములేదు సరియె ధనమును లేదాయె
నిట్టి నిన్నుఁగూడు టేటినీతి?
ధనము మనములేని దందనకాంద్రతో
మనికి మమ్ముబోంట్ల మతము కాదు.

వారకాంతలకును వక్కలు నాకులు
నైన నీయనట్టి వానిఁగనము
చిల్లిగవ్వ లేక చెల్లునే సరసంబు?
లేరబాజుగ! లేచి పోర! వేగ."

ఇటు మటుమాయలాడి తన
యిల్లె సమస్తమటంచు నెంచు నా

విటుఁ బటువాక్యశూలముల
వీఱిఁడిఁ జేసి కలుప నాత్మ ను
త్కటముగ నాతఁడున్ వగపుఁ
గాంచుచు నివ్వెఱఁబొంది యక్కటా!
యెటువలె నింక నీజరభి
యింట వసింతు నటంచు నెంచుచున్.

మతిమంతుఁ దూలనాడిన
మతియుతుఁడను నాకు నిట్టి మతకమునఁ బడఁగా
గతియగుటకంటె వేఱగు
గతి గలదే? యనుచు జరభిఁగని యిట్లనియెన్.

మాధనమునఁ బెఱిఁగిన నీ
బోధనములు మెచ్చువచ్చె బుద్ధియు వచ్చెన్
మాధనము మరలఁ బొందెడు
సాధనములు లేవె? యనుచుఁ జక్కంబోయెఁగా.

ఆతఁడారీతి వేశ్యాగృహంబు విడిచి
దీనగతి జనులమొగంబు గానలేక
మాపువడుదాఁక నొకమావి తోపునందుఁ
జేరి తలదాఁచుకొనియుండెఁ జింతగూరి.

జనపతి మావితోపున వి
చారములోఁ దలదాచియుంట నే
వనపరిపాలువల్ల విని
పాపపు దైవముచేత కాత్మలో

వసరుచు దీనుఁడైన చెలి
పజ్జనుఁ జీఁకటి నేగి యొక్కచోఁ
బనవుచు నొంటిజాలిఁబడు
వానినిగంటి మనంబు ఝల్లనన్.

క్రమమునఁ జెంత కేగి నను
గాంచి మనంబునఁ బట్టరాని దుః
ఖమున మొగంబు వాంచి కడుఁ
గారియనొందఁగ నేను నట్టి దుః
ఖముననె చెప్పఁగా నలవి
గాని యవస్థను బొంది యెట్టెటో
క్రమమున ధైర్యమూని సఖు
కన్నులనీళ్ళు తొలంగఁజేయుచున్.

"మిత్రమా! దుఃఖమునుబొంద మేలె? చెపుమ!
కష్టకాలంబుననె ధైర్య గరిమ వలయు
జేలుదనమూని యిటు జాలిగూల నేల?
క్రమ్మరఁగ మంచిదినములు రాకయున్నె?"

ఇటులన నించుకంత మొగ
మెత్తి కనుంగొని ప్రాణమిత్ర! నీ
వటుహితవాక్యమున్ దెలుప
నయ్యెవి వీనులఁబెట్ట కిట్టిచె
న్నటిగతిఁ బొందు నన్ను విడ
నాయము; మూర్ఖుఁడ నానిమిత్తమై

కటకట! యీవిధానఁ గడ
గండ్లను బొందకు మయ్య లేశమున్.
అని తెరతెరలుగ వచ్చెడి
ఘనదుఃఖఝరిం జరింపఁ గానక మఱియుం
బనవుచు బేలుందనమునఁ
దన యవివేకమున కెంతొ తల్లడపడియెన్.

వెగచి వెగచి తన్ను వెలవెలందుకతల్లి
తూలనాడుటయును దొంగవోలె
రూపణికయుఁ దాను లోపలనే యుండి
తరలి పైకిరాక తక్కుటయును.
ఆదిగాఁగల పరిభవ మంత చెప్పి
మిత్రరత్నంబ! నాఁడు నీమేలిమాట
చెవుల నిడకుండుటయె యింతచేసె నన్ను
కూళనై యాత్మరాజ్యంబు కోలువడితి.

నావిని వారకాంతయెడ
నా వెడ నమ్మకమూని యుండుటల్
భూవర! యంటి నాఁడె; యది
బుద్ధి గణింపక యిట్టులైతి మా
యావిని జేసినట్టికృత
కావళులిన్ని యనంగఁ జెల్లునే?
పావనినైన నీసకియ
పై వెగటొందఁగ మాయఁ జేయదే.

ఎల్లవిధంబుల నీపద
పల్లవములె దిక్కటంచుఁ బలవించుచు నీ
యుల్లంబు నొందఁ గోరిన
సల్లలిత గుణానురూప సాధ్విని నకటా.

ఎడఁబాపఁ దలఁచి నీక
ప్పడతుక విషమంపె ననుచుఁ బన్నాగం బా
క్కడు వన్ని నీకు నమ్మిక
పొషమించి సతీమతల్లిఁ బురిఁ బాప దొకో!

ఆ కీలుకుఁ దెలియకుంటివి
మోకాలికి బట్టతలకు ముడిపెట్టిన దా
రాకాసి; కోడి యెక్కడ?
ఘోకను గబళించు లేడ? బుద్ధిఁదలఁపుమీ.

ఆదియునుగాక చిత్ర మొకఁ
డా వెలచేడియయందుఁ గంటి నీ
కది వివరింతు నీవటు ప్ర
యాణము చేసిననాఁడు లేనిపో
నిదె యసహిష్ణుతఁ దెలిపి
నిక్కము సైపని దానియట్ల తా
వదరుచు నూతిలోఁ బడదె
వారవధూటిక నీవు బెగ్గిలన్.

అంతకు మునుపే జలముల
పొంతం గూపమునఁ జిక్కముం గట్టఁగ నా

జంత నియోగించిన దే
కాంతంబున నీకెఱుంగగా రాకుండన్.

అకట! వెలయాండ్రు కల్లమోహముల విటుల
కగపడంగఁజేయఁ బన్నుతంత్రాదికంబు
లిన్ని యన్ని యటంచును నెన్నదరమె?
ఫణిపతిని సృజియించిన బ్రహ్మకైన.

కనుఁగొను మాయావతి క
ల్పన మని చిక్కంబుఁజూపి పార్థివునకు దా
నిని దీసినాఁడ నని తె
ల్పిన విని యాశ్చర్యమొంది పృథ్వీశుండున్.

వెలవెలందిమతక మలవియై యెఱుఁగంగ
మతియుతుండ వాట నతిచతురత
దానిమోసమెల్లఁ దప్పక గ్రహియించి
తనుచునన్నుఁ గొంత వినుతిచేసి.

ప్రాణమిత్ర! యెన్నఁడైన నీనిర్భాగ్య
దశను విడిచి సతిని ధరణిసతిని
ముదము మీఱ మరలఁ బొందఁగఁ గందునే
కలుగు నెట్టు లిట్టిఖలున కనుచు.

ఉమ్మలమునొందఁ దగునీతి నూఱడించి
తెల్లవారకమునుపె విదేశమునకుఁ
బోవుదమటంచు నొకగున్నపొన్నక్రింద
నిద్దఱము నిద్రనొందితి మింతలోనె.

కాకులు కూయఁగ మేల్కని
నాకడ నెచ్చెలిని గనక నవయుచు నతఁడే
కాకి యెటుపోయెనో? యని
వ్యాకులతను వానిఁగూర్చి యాయాయెడలన్.

తిరుగుచువచ్చితి నని భూ
సురతనయుఁడు రత్నవర్మ చొప్పెఱిఁగించెన్
గరుణామయ! యాకథ నే
నరుదారఁగ విన్నదాన నాసమయమునన్.

ఆరత్నవర్మ యనురూ
పారమణియుఁ దన్నుఁగోరి పనవుచునుండన్
వారాంగనలోఁ బోవఁడె
యేరికి మనసేప్రధాన మెంచికొనంగన్.

♦ ♦ ♦

అగ్రోత్తరభాగము:

అకట! కరుణలేక యాకథ నీకథఁ
జాటి లేనిపోని మాటలాడి
దీనురాలినన్ను సూనశరార్తినిఁ
గూలఁద్రోయఁ జూడకుము మహాత్మ!

కోరికఁ దీర్పవేని యివి
గో! జననున్నవి మేని ప్రాణముల్
మారశరాహతిన్ వెడలి;
మాటలువేయు నీఁకేల? పుణ్యమున్

గూరిచి యాదరించుటయు
క్రూరతఁ బాపమతిఁ ద్యజించుటో
యారయు మింక; నీకొఱకుఁ
బ్రాణము వాయుటకంటె నున్నదే.

అని తెల్పఁ బురుషుండు నిల్వనను నీ
కైనట్లుగా నుండి య
ల్లన నొక్కించుక యంతలోఁ దెలిసి వె
ల్లంబోయి నిట్టూర్పు లో
య్యన శోణాధరబింబ సంపదల మా
యంజేయ లోలోపలం
దనకుం దోఁచువికారముల్ మొగమునఁ
గన్పట్ట విభ్రాంతిచేన్.

తనయునికికి నొకలాగై
కనకాంగికి నిట్టికోర్కె కారాదని లో
ననుకంప గదుర నయ్యో!
వనజానన! తత్తరంబు వలవ దుడుగుమీ.

ఏకపత్నీవ్రతుండ నే నెట్టులింక
నీమనసుదీర్ప నేర్తును నెలతమిన్న!
కాక యనురూపయైననా కాంత యుండె
ప్రక్కయింటనె శయ్యపైఁ బండియుండె.

నాతి! నీప్రాణసంరక్షణంబు కొఱకు
వ్రతము చెడఁజూచినను బ్రాణసతికొకింత

తెలియకుండదు దానన తెగును సాధ్వి
యెట్టులైనను స్త్రీహత్యయే ఘటిల్లు.

అనుకూల దాంపత్యమునకు భంగముతెచ్చి
పాయంగరాని పాపము గడించి
వరసతీ ధర్మంబు పరగడఁ బడవైచి
జారిణియను పెద్ద దూరు వడసి
నలుగురిలోపల నగుబాటులను జెంది
తలయెత్తి తిరుగంగఁ దలఁకుచుండి
చెలువునున్నతికిని దలవంపు ఘటియించి
కొలమువారలలోనఁ గొఱఁతఁ గాంచి
ఐహికాముష్మిక సుఖంబు లవులఁ ద్రోసి
తిరుగ మనసయ్యెనే! వెఱ్ఱితెఱవ నీకు!
కుడిచి కూర్చుండి యిటువంటి గొడవతెచ్చి
కొని యధోగతిపాలు గాఁగోరె దేల?

అన విని యీతని కొకయుం
గన గలదని వినుటలేదు కడు చతురుండై
నను జంకించుచు నున్నాఁ
డని తలఁచి మెఱుంగుబోఁడి యాతనికనియెన్.

చాలునుజాలు నిట్టియొక
సక్కెపు నీతుల కేమిగాని, యి
ల్లాలొకయింటిలోన, సర
సాగ్రణి వేఱొకయింటిలోన నా?

మే లెఱుఁగంగవచ్చె; తల
మీఁదికె వచ్చెను నీకుయుక్తు లా
బాలికయేది చూపుము? సె
బాసు! నిజంబుగ నిందెయుండెనో?

నావుడు నద్దిరయ్య! జత
నంబిది మంచిదె; తాఁ దనంతనే
యీవిధిఁ దెచ్చికొన్నయది
యే నటుచేసిన దీనిబాధయే
పోవునటంచు నింటితలు
పుల్ దెమలించిన యంతలోనె ని
ద్రావృత యొక్కచాన కన
నై చెలియాసల వమ్ము సేయుచున్.

దోరము తెరచిన చప్పుడు
తోరంబై నిదుర తెలిసి తోడన యానా
రీరత్నంబడలున నా
పూరుషుఁ డున్నెడకు వచ్చి పోడిమి గనుచున్.

పంకజాస్త్రుని యాఱవ బాణమనఁగ
నుజ్జ్వలాకారయైయున్న యువతి నొకత
నడిమిరేయి నాపూరుషు కడన గాంచి
సంభ్రమాశ్చర్యచిత్తయై చాన నిలువ.
కోపమొ భయమో యీర్ష్యయొ
తోపంగాఁబోలుఁ ప్రథమతోయజముఖి యా

కోపమున మేను వడకఁగఁ
జూపుల నిప్పులను జల్లుచున్ మరలి చనెన్.

"పరచిత్త విత్త హరణము
సారిదిం జేయుటకు జారచోరులు వేషాం
తరులై తిరిగెద రాయెడ
నూరులు గనినఁ దలఁగి పోవుటుచితంబెకదా!
సుందరుఁడఁట! యేకాంతపు
మందిరమఁట! వానిఁగోరి మగనా లఁట! తా
నందుఁ గని వచ్చెనఁట! యీ
యంద మొరులు చూచుటయు రసాభాసమె కా!

వనిత యెవ్వనిమదిగోరి వచ్చినదియొ
యతని యిల్లాలె యెదుటఁ బ్రత్యక్షమైన
భయము తలముంపదో? జారభామినులకు
సాహసముకంటె నధికంబు సంశయంబె.

అతనియిల్లాలు తనకంటె నందమైన
దనెడు నీసు జనించిన దందుమేని
దానినిమించిన తమి వానిపైని గలిగి
యుండఁబోనేల? కారణం బుండవలయు.

ఎంతవేసమూని యిలుచొచ్చె? నింతలోఁ
జనియె మనసు చివుకు మనఁగఁబోలు!
నెన్న నెంతో తమక మున్నది! మరల నే
వరుసనైన వచ్చి పడకయున్నె?"

ఆదియును నిదియును గనుఁగొని
మదవతి మదిలోన వింతమాదిరి యనుచుఁ
వదనమున వెలుఁగులొప్పఁగ
నిదియేమని చెంతనున్న హితునడుగుటయున్.

చెలువ! యేమి చెప్పు చిత్రంబుగానుండె
నీవు నిదురఁగూర నీనెలంత
భయము పడినదానివలె వచ్చి యిలు సొచ్చి
యెంతచేసిపోయె నెఱుఁగవుగద!

అని యాటక్కరిక త్తియ
చనుదెంచిన దాదిగాఁగఁ జనినది తుదిగాఁ
దనకడ జరిగినదంతయుఁ
గొనకొని వినిపించెఁ బూసగ్రుచ్చినరీతిన్.

వనిత యప్పుడె నిద్రమేల్కనుట స్వప్న
మేమినైన, దీనఁ దార్కాణ మేమయినదో?
సుడియు వడగాలి తాఁకునఁ దొడిమవీడి
రాలు కుసుమంబువలె నేలఁ గూలబడియె.

పతి పరకాంతలతో సం
గతిఁ జేసిననైన సతులుగనలరు; తనుదాఁ
బతిఁ జేరిన పెరచెలి చే
ష్టితముల వినినంత మూర్ఛజెందె నిదేమో?
వెలవెలంబోయి యతఁ డంత దెలుపుచుండ
విడుచుచుండెడి దశ్రువుల్ వినుచు వినుచు

ఆ చరిత్రంబునందు నే యంశమైన
నాహృదయంబునకు శూలమయ్యె నేమొ?

ఇగురుఁబోడి హృదయ మెంతటి మృదులమో?
తేటతెల్లముగను దెలిసిపోయె
కష్టగాథ నుడువఁగా నింతవాటిల్లెఁ
జిగురుటాకు డప్పుచేయఁ దగునె?

కనులయెదుటఁ బడియెఁ గాన మూర్ఛిల్లిన
దనుచు నిశ్చయముగ నాడవచ్చు
చేష్టఁబట్టి యూహ చేయవచ్చును గాని
యెవరిమనసుఁ దెలియ నెవరితరము?

అంతట బూరుషుండును ద
దంగనపాటున కార్తినొందుచున్
"ఇంత యిటేల రావలయుఁ?
జల్లఁగఁ బ్రొద్దులు పుచ్చుచున్న మా
చెంతకువచ్చి యిట్లడలఁ
జేయఁగనేల? సమస్తమేటి కీ
కాంత కెఱుంగఁ జెప్పితిని?
కార్యము దప్పెనిఁకేమి సేయుదున్."

అనుచుఁ దత్తరపాటున నతివఁజేరి
వలయు నుపచారములఁ జేయఁ దెలివిఁ గాంచి
ససి చెడిన మేనితో బాష్పజలము లొలుకు
కన్నుఁగవతోడ నెచ్చెలిఁ గౌఁగిలించి,

అనయం బ్రాంతిని నేమొ చెప్పుతఱి సు
గ్రాకారుఁ డుద్వృత్తనూ
జనితాంచద్ఘన తేజుఁడొక్కఁడు లస
చ్చంద్రాయుధోపేతుఁడై
తన వెంటన్ జనుదెంచు పూరుషుని న
త్యంతంబు దూషించుచున్
గనులన్ నిప్పులురాలఁ దత్పృథుతరా
గారంబు సొత్తెంచుచున్.

కనుఁగొమ్మిమ్మ యనుకూల దంపతుల మూ
ర్ఖా! మున్ను నాతోడఁ బా
వనరూపాన్వయ సచ్చరిత్రముల నే
పద్మాక్షినిఁ బోలునం
గన లీభూతలమందు లేరనుచుఁ బొం
కన్ గొంకవో యట్టిపా
వనరూపాన్వయ సచ్చరిత్రగల దీ
పద్మాక్షియే కాదొకో?

మగనితోఁ గుల్కుచుండె నీమగువఁజూడు
మది పతివ్రతాధర్మంబె యగునుగాదె!
తిరిగినదిగాదు నీనాల్క తెలివతెరగు
వర్ణనము సేయుటకు నలవాటు పడుము.

ఎంతసుబుద్ధివి! నీమతి
మంతున కెక్కఁగద! దీని మహిమలు దెలుపన్

జింతాను రూపముగ నను
మంత నె భారతిగ నిన్ను నభివర్ణింతుఁ.

అన నొకరి మొగము నొక్కరు
గని వెలవెల పోవుచుండఁగా గృహయజమా
నుని జేరి చురుకుచూపుల
మొనయించుచుఁ బలికె క్రోధమూర్తియపోలెఁ.

ఔర! యిందాఁక నొక్క కల్యాణిచెంత
నిచ్చినట్టి యుపన్యాస మెఱుఁగవచ్చె
పగలు పన్యాసియును రాత్రి మగఁడుఁ గాఁగ
మెలఁగు నన్నట్టులుండె నీ తులువతనము.

తాను వలచినది గదారంభ! యనురూప,
సాధ్వి, సచ్చరిత్ర, సాధుశీల,
చెలువమీఁది వలపు తలకెక్కియున్న నీ
వంటివాని కట్లు పలుకఁ దగదె?

కోరివచ్చుకాంత స్వైరిణి, నీకడ
నలరుకాంత సాధ్వి, యంటి భళిర!
కనుఁగొనంగనెందు తనకంపు తనకింపు
గాకయున్న బ్రతుకఁగాఁ దరంబె?
నిను మదిఁ గోరి బాళిమెయి
నిల్వఁగలేక మనోహరాంగ! న
న్నెనయు మటన్న కాంత నెటు
లేనియుఁ ద్రోపుడువెట్ట నెంచి యే

వనిత పతివ్రతావిమల
వర్తనముఁ బ్రకటించి మాటలం
దనుపఁగఁజూచి తా సుగుణ
ధన్య యిదే యగుఁ గాదె? దుర్మతీ.

అనుచుం గోపము రూపముంగొనినయ
ట్లావీరుఁ డుద్యద్ఘనా
ఘనగర్జారవ భీకరం బయిన హుం
కారంబునన్ శత్రుమ
ర్దనదుర్దాంతకరాళ దారుణపటు
ద్రాఘిష్ఠకౌక్షేయకా
తనుశస్త్రం బగుహస్త మెత్తి ప్రళయో
ద్యత్కాల కాలాకృతిఁ.

ఓసి దురాత్మురాల! కన
న్నొల్లను దుర్గుణగణ్యవై సము
ల్లాసముతోడ దుర్ణయక
ళాకుశలుండగు వీనిచెంగటన్
బాసిలునిన్నుఁ; దారుణకృ
పాణహతిం దలద్రుంతు తేనియుం
బూసినకత్తిఁబోలు నిను
పోవిడనంచు ఖరాసి నాసతిఁ.

పాడువఁగ నేగునాతనికిఁ
బూరుషుఁ డడ్డమువచ్చి కత్తి బ

ల్విడఁగొని యేల లేఁతపని?
వీరవరుండవు గావె? సాధ్విని
వ్వధువునఁ జేయిఁ జేసికొన
వచ్చునె? నాయనురూప చంపఁగాఁ
బడునొక్కొ నాదుకంఠమునఁ
బ్రాణములుండిన యంతవట్టునన్.

వలదు వలదు రత్నవర్మ మహీశ! నీ
సాధ్వినిట్టునేల చంపఁదలతు
నీవె పెండ్లియాడి నావె? లోకమున ని
ట్లున్న వారె చేసి కొన్నవారు?
నావుడు నెట్టెలు? నీవే
గావా యీచెడిపె కింకఁ గలరే నాథుల్
భావంబుదనుపువార ల
హా! వారాంగననె మేల్ బళ్ళా! యనిపించెన్.

అనిన ననురూప గుండె ఝల్లని కలంగి
హా! మనోనాథ! పూర్వకర్మానుభవము
చెడునె? నీచేయునదియెల్లఁ జేయుమయ్య!
ఫలమిఁకను నింతకంటెను గలదె నాకు?
ఓపఁజాల నయ్యయో! యిట్టిదుఃఖంబు;
తడవుసేయనేల దయదలిర్ప
పాపి నన్నుఁజంపుపనికిఁగా భారతీ!
కత్తినిమ్ము ప్రాణకాంతునకును.

అని యెనలేని శోకవివ
శాత్మకమై ప్రకటింప నద్దిరా!
కనుఁగొన వింతవింత లగు
కల్పనలన్నియుఁ దోఁచుచుండె నీ
తని నిటు భారతీ! యనుచుఁ
దన్వి వచించుచున్న దేమి? గో
పనమునను న్న యీమగది
భారతి గాదుగదా! తలంపఁగన్.

అనుచు రత్నవర్మ యాశ్చర్యమగ్నుఁడై
యితఁడు భారతియఁటె యీమె దీని
భార్యయట్టె! యెట్టి పాగెము? మిత్రమా!
కంటె! వింతనాట కంబు దీని.

గోడ వెట్టినట్టు లాఁడుది బొంకిన
పురుషుఁడైనఁ దడకఁ బూసినట్లు
లనుట నిక్కమయ్యె నరయుమీ మతిమంత!
మంకుజంత యెంతబొంకుబొంకె?

తానట్లు ప్రేలినంతనె
నే నాలోచింపకుందునే! భారతియే
తానై యుండిన నీవెడ
మానిసివస తెలియఁబడుసుమా! నిముసమునన్.

అని ఖడ్గం బువ్వెత్తుగఁ
గొనుటయు వెలవెల్లనగుచు క్షోణీశ్వర! నీ

వనుమానింపకు మీపా
వనిమాటకు వేఱుగలదె? భారతినె సుమీ.

అని పురుషరూప మెడలిచి
తన సత్యంబైనరూపు దాలిచి నిలువన్
గని సంతసమున నేమీ
వనజాననలార! యెంతవారలు మీరల్.

భాగ్యమయ్యెఁ గోపభావంబునను జేసి
యొండురీతిఁ జేయ కుండఁదప్పె
ననుచుఁ బ్రియముతోడ ననురూపఁ గౌఁగిటఁ
జేర్చిపలికె నగవు గూర్చునటులు.

పడఁతి! మంచిమగని గడియించుకొంటివి
పాపబుద్ధి నిన్నుఁ బరిభవింపఁ
దలఁపు గొన్ననన్ను దండింపుమీ! శిక్షఁ
బడఁడె నేరపెట్టఁ బడినవాఁడు?

నావిని మోము వాంచి సుజ
నస్తవనీయచరిత్ర యైన య
ప్పావని ప్రాణనాయకుని
ప్రాంతమునం బ్రథమోపగూహన
వ్యావృత మైనసిగ్గుఁ దడఁ
బాటొనరింప వచింపరాని మో
హావిలచిత్తయై నిలిచె
నత్తరిఁ జిత్తరుబొమ్మయో యనన్.

రత్నవర్ణయుఁ దనసతీ రత్న విమల
గాత్రసంస్పర్శనంబునఁ జిత్రగతిని
మాఱుఁ దొంటిగతి నెఱుంగ నేరకుండఁ
గొత్తైదులచల్మి యాలీలఁ గూర్చు టరుదె?
"అకట! నిర్దయుండనై మటుమాయల
మారిదైనయట్టి వారకాంత
పలుకుబడిని జేసి యిలు వెళ్ళఁ గొట్టితి
నేను సచ్చరిత్రలైన మిమ్ము.

అబలలార! మీర లయ్యనంతరమునఁ
గూళనైననన్నుఁ గూర్చి యడలి
ఎచ్చటెచటి కేగి యెట్లుమెలంగితి
రెట్లు చేరినార లిప్పురంబు?
భారతి మేలు! నీదుసహా
వాసముచే ననురూప యిమ్మెయిం
గ్రూరతఁ బ్రాణనాయకుఁడు
కోపముతో నెడలింప దిక్కులే
కారట మొందుచుండియును
ప్రాణముతో నిలువంగ నోపె చే
కూఱె శుభంబు సంపదల
కుం గుదురైతిమి నీకృపాప్తిచేన్.

పూర్వోత్తర భాగము:

అనిన భారతివల్కు నవనీశ! నన్నింత
పొగడంగ వలయునే? పూర్వకర్మ
మనుభవింపక తప్పునయ్యా! పెంజీకటి
కొన్నాళ్ళు వెన్నెల కొన్నినాళ్ళు
గాదె? నీవిప్పుడీకాంత నిల్వేడలింప
నక్కటా! యనియెడు దిక్కులేక
విలపింపఁ దొడరు
నమ్మలిక డగ్గరి సుబు
ద్ధియు నేను నొక్కింత దిగులు దీర్చి
అక్కచెల్లెండ్రవలె పుట్టి నంతనుండి
పెరిగినారము గాన నీతెరవయెడరు
మువ్వురము బంచికొని దైవమునకుఁ గుంది
కుంది యొందేని తల్ఁదాఁచికొనఁ దలంచి.

ఈవిధమున దుఃఖదేవత మూర్తిత్ర
యంబు దాల్చెనేమొ యనఁగఁ జూచు
వారిగుండె లెల్ల నీరుగాఁ జేయుచు
దారయొద్దఁ బల్లెటూరుఁ జేరి.

అందొక సాధుశీలయగు
నవ్వ గృహంబున నిల్చియుండి చ
క్కందనమందు మిన్నలగు
కాంతల కాపద లెందుఁ జెందునం

చుం దలపోసి రూపముల
చొప్పులు మార్పఁదలంప నీమెదా
నందుల కోపనన్న వల
దట్టులె యుండు మటంచు నేనొగిన్.

ఆసుబుద్ధితోడ ననురూప నట డించి
యచటి కనతిదూరమైన దార
యనెడు పురికిఁ జేరి యటఁ బురుషోచిత
ములగు వస్త్రములను విలిచి యంత.

కనుమూసినఁ దెరచిన నొక
యనువుగఁ జీఁకటులు గ్రమ్మి యాకసము ఘనా
ఘనసంయుతమై యారా
త్రిన చనుదెంచుటకు నామది న్వెరపింపన్.

అట సుబుద్ధియున్న యది భయమేమి రే
పరుగవచ్చు నని రహస్యదేశ
మందుఁ జేరి పూరుషాకారము ధరించి
యొలమి నొక్క విప్రునింటి కరిగి.

అట నారాత్రి పరుంటిఁ గాని కనుమో
డ్పైనం గనన్ లేద య
చ్చట నాయింటి గృహస్థురాలికిఁ దనూ
జాతుండు దుష్కర్మలం
పటుఁడై దుఃఖము వెంప నావెలఁది భా
వంబందుఁ జింతించుచో

నెటులో వృద్ధయొకర్తు తేర్పసరిపో
యెన్ వింటచే నాకునున్.

వేగుటకు మున్నుగా లేచి విప్రకాంత
కెఱుఁగఁ జెప్పి పల్లియనున్న యింటి కరిగి
దీనయైయున్న యనురూప తెరగదెల్లఁ
గాంచి నాకలరూపెఱింగించి చూప.

హోయని మూర్ఛవోవమది
నచ్చెరువున్ భయమున్ విచారముఁ
వేయువిధంబులొందె చెయి
వేఁకలంచినయట్లుచేయన
య్యో! యిదేమి పాపమని
యూర్చుచు నెట్టిటో తేర్చిలేవఁగా
సాయముఁజేసి వెజ్జరచి
సాధ్వి సుబుద్ధి యేటేగెనో యనన్.

గుండెలడల నెలుఁగు కుత్తుకఁ దనరంగ
భారతీ! యటంచుఁ జేరఁదీసి
కటకటా! సుబుద్ధిఁ గాంతుమే మనము జీ
వములతోడ ననుచు వంత గుంది.

"నినుఁ బతిగూర్పకుండినను
నెచ్చెలిఁ గానుసుమా మనంబునం
బెనఁగొను తాపవేదనల
బెగ్గిలఁబోవకు మమ్మ యంచు న

న్నసుమతి నూఱడించుచును
ప్రాణసఖీమణి రాత్రివేళ్ళ నా
వెనుకనె పండియుండినది
వేగఁ గనంబడ దేమిమాయయొ?

అనిశం దల్లడపాటు నొందుచును నే
నన్నట్టులే యయ్యెనా!
వనితారత్న మదెట్టి యాపదలకుం
బాలయ్యెనో? యంచుఁ దీ
అని దుఃఖంబున నెల్లెడన్ వెదకి కా
ర్యంబేమియున్ గాన కీ
యనురూపాసతితోడ నీపురమునం
దావాసముం జేయఁగన్.

చనుదెంచి యీగృహంబున
ననురూప మెలంగుచున్నదని యెవ్వరికిన్
గనుపట్టకుండ గూఢం
బున మెలఁగుచు నుంటి నేనుఁ బురుషాకృతితోన్.

అనురూప యుపన్యాసం
బును వ్రాయఁగఁగలుగునట్టి ప్రౌఢ యగుట నిం
టనెయుండి వ్రాయుచుండును
చని చదివెద నేను నార్యసభలం బెలుచన్.

ధర్మోపన్యాసకుఁ డని
నిర్మలమతి యనియు మాట నేర్పరి యని న

న్మర్మిమలిఁ బూజింతురు నా
మర్మ మెఱుంగరు పురంబు మనుజులు సుకృతుల్.

దానఁజేసి భారతీనందుఁ డనుబిరు
దంబు గలిగె ననినఁ దన్వి! వింటి
మాణిభద్రుఁ డెంతొ మర్యాదగలవాఁడ
టంచు నిన్నుఁ బొగడ నప్పుడపుడు.

అనవుడు మాణిభద్రుఁడు ధ
నాఢ్యుఁడు రూపమునందు వృత్తమం
దనుగడుఁ బెద్దయాతనికిఁ
దొయ్యలినా నొకజంత దాపురిం
చినది కళంకమట్టుల యి
సీ! యది యింతకు మున్న నన్నుఁగాం
చి "ననుఁ బరిగ్రహింపు"మని
చేరిన దేమన దాని చెయ్దముల్?

అనవిని మగువా! యేమియు
ననఁబోయెడు సుమ్మి యట్టు లొరూపున న
చ్చినవాఁడ నేన యని య
మ్మనుజవిభుఁడు పలుక వింత మనమున గదురన్.
భారతి వానిఁ గాంచి నర
పాల శిరోమణి! యేమి! యెట్టిటూ
నీరజగంధి రూపమున
నీవ తమి న్నను నట్లుసేయఁగాఁ

గోరు మహానుభావుఁడవు!
కోమలి రూపునుదాల్చి యట్టు లే
తేరఁగ నేమికారణము
తెల్పు మనం జెలి కాతఁ డిట్లనుఞా.

ప్రౌఢ! యిందాక నేనాఁడు రూపుతోడఁ
జెప్పిన కథాంశమందు నెచ్చెలినిబాసి
చనినతరువాత కథవిన్న సకలమెఱుఁగ
వచ్చునని తెల్పి యారత్నవర్మ విభుడు.

♦ ♦ ♦

ఉత్తరోత్తర భాగము:

మనమున నూఅడిల్లి మతి
మంతుఁడు నేనును నాఁటిరాత్రి మం
తనమున నిద్రగంటిమి గ
దా! వనమందునఁ బొన్నక్రింద నం
తన తడవైన లేక కల
తం బడి మేల్కని శోకవహ్ని నె
మ్మనము దహింప లేచి మతి
మంతునివీడి నిజేచ్ఛఁ బోవుచోఞా.

కలకల తెల్లవారె వెతఁ
గాంచుచు నుండిన నామొగంబునం
గలకల తెల్లవారిన ప్ర
కారము దెల్పుచు; నేను నంత ని

ర్మలతరనీరనీరజమ
రాళవిరాజితమైన యొక్క మే
లొ్కలకును గాంచి కాల్యములు
గొబ్బునఁ దీరిచి కంటి చెంగటన్.

ఒకవీధి వేదపాఠకుల యధ్యయనంబు
వీనుదోయికి వింత విందు సేయ
ఒక వీధివీరవరోచితోద్య చ్ఛర
వ్యాయామములు మనంబలరఁ జేయ
ఒకవీధి వివిధవ స్తక మహాపణవస్తు
విసరంబు కన్నుల విందు సేయ
ఒక వీధి విలసత్కృషికగోష్ఠ సంచర
ద్గోసంఘములు చాల కుతుక మిడఁగ

వివిధమణి సౌధపరిఘానవీన వేశ్మ
పంక్తు లానందమును బొందుపఱచుచుండ
ధారుణీ తరుణీగళ తారహార
హీరమణిఁబోలుపురి కురంగేశ్వరంబు.

కనుఁగొనుచుఁ బోవుచుండఁగ
ఘన సౌధాగ్రంబునుండి కనదంభోజా
ననయోర్తు నన్నుఁ గన్గొను
చునె దిగివచ్చి కవుగింటఁ జొన్పుచు ననియెన్.

చిన్ననాఁటి చెలిని నన్నుఁజూడక యిట్లు
మాఱుమొగము పెట్టి తారెదేల?

చెలిమికాఁడ! నన్ను చిన్నబుచ్చి యిఁకెందుఁ
బోవవచ్చు సౌధమునకు నడుమి.
అనుచుఁ జిన్ననాఁటి యనుపుకత్తియయైన
చంద్రరేఖ నన్ను సదనమునకుఁ
దోడుకొనుచుఁబోయి తులలేని సత్కార
నియతిఁ గుశలమడిగి ప్రియముసేయ.
చేతమున వారకాంతల చేఁతలకును
రోసియుండియు, నప్పుడా వేసముననె
యొరులఁ గననేరకయు పెచ్చు పెరుగుచున్న
యాఁకటికిఁ దాళకయు దాని కనుమతించి.
నాకమున కేగినను విడి
యాకులు తప్పినవి గావటంచుఁ దలఁచుచున్
దేకువ నాపగ లంతయు
నాకడనే యుండి రాత్రి యగుటయు నంతన్.
వెలవెలఁదియింట కమ్మఁగా విందుఁ గుడిచి
లలన వివిధోపచారములను గ్రహించి
శయ్యపైఁ బండి నాలవజాము వేళ
వనితఁ దప్పించుకొనిలేచి వచ్చుచుండి.

క్రమమున నాయాపురములు
విమలనదులు ఘోరమైన విపినములును సం
భ్రమమునఁ జూచుచు నీనగ
రమునకుఁ జనుదెంచియుండఁ బ్రాణసఖుండున్.

మాణిభద్రుఁడు నన్నుఁగాంచి మమత నించి
కౌఁగిటను జేర్చి యానంద గరిమఁగూర్చి
తనదు మందిరమునకుఁ దోకొనుచు నేగి
యచట మతిమంతువలన వృత్తాంతమెల్ల.

వినినది వినినట్లుగ నా
కును దెల్పి మనంబునందుఁ గూరిమి గదురన్
నను మతిమంతుని గూరిచి
మనకు శుభంబగుత! మిత్రమా! యని మఱియుఁ.

అతఁడును నాతనికంటెను
నతని సతియు నాకుఁబ్రీతి యగునట్టులు సం
తతము నుపచారవిధు లం
చితముగ నొనరింపనుంటి చెలువునితోడన్!

అటులుండి ధూర్తజనలం
పటుఁడ నగుచు మిత్రుమాటఁ బాటింపక చె
న్నటినై యోడిన ధనమును
బటుమతి నిప్పింతు మాణిభద్రుని వలనన్.

ఇంటఁ దినుటె కాక తుంటరికితవుల
నింటిపైకిఁ దెచ్చి తంటబెట్టి
ధనము దోఁచుచుండె నని యేవగింపదు
సఖుని చెలువ యెట్టి సాధ్వియొక్కొ?
మతిమంతుండును మాణిభద్రుఁడును స
న్మార్గంబునం ద్రిప్పఁగా

సతతంబుం జెవినిల్లుగట్టుకొని న
చ్చం జెప్పిరే కాని నా
మతియేమో యటుసేయ నోపకయ దు
ర్మార్గంబునం బోవుచుం
గితవాసక్తిని మానదాయె నకటా!
కీడ్పాటు వాటిల్లుటన్.

ఈరీతి ధూర్తకోటిం
జేరి చరింపంగ నొక్క చెలికాఁడనె నేఁ
"డోరీ! విన్నారఁటరా!
నారీతిలకంబు పురుషనాయకుఁ డగుటన్.

భారతీనందుఁడను పేరు వడసెనంట!
భారతియొ? నందుఁడో? చూచి తీరవలయు
సభల కరుదెంచునఁట! యొకసారియైనఁ
జూడలేదొర!" యనఁగడు చోద్యమంది.

నేనే చని కనుఁగొనియెద
నేనే చని కాంతు ననుచు నే నే ననుచుం
నానారీతులఁ గేరుచు
మేనులు పొంగార మీఁది మీఁదికిఁ జనుచుం.

మీసంబులు వడిపెట్టుచు
నా సరివారెవ్వరనుచు నాకపటకళా
భ్యాసము మీసరవోవునె
వేసము చూచెదముగాక ప్రేల్మిడిననుచున్.

పంతములనిట్లు లొండొరుల్ పలుకుచుండ
నప్పుడు మతిమంతుఁ డెద్దియో స్వాంతమందు
యోచనము చేసి తలయూఁచి యుత్సుకమతి
మమ్ముఁ గని పల్కెనిట్లు దైవముపగిది.

ఇట్టిపనుల చేయనిండఱ నీతఁడ
మేలుచేయి వడయు మీరలెల్ల
వీనిఁ బంపుఁడనుచు వెడవెడ నొప్పించి
యిట్టిరూపుతోడ నేగుమనిన.

ఆఁడురూపుఁ దాల్చి యర్ధరాత్రంబున
నెట్లుపోవువాఁడ నేననంగ
వెనుకఁ గత్తిఁబూని చనుదెంతు మిత్రమా!
పరులవలన నేగి పొరయకుండ.

అని మతిమంతుఁడు న్వెనుక
నాయుధముం గొనిరాఁగఁ జీఁకటిన్
ఘనవిపదంబుధిం బడిన
కైవడిఁ గైతవ మేర్పరించి నే
ననువుగ నిందు చొచ్చితిని
నాకపటక్రియ సేయకున్న నె
ట్లోనరుగృహంబుఁ జేర? శుభ
మొందుట యెట్టులుగల్గు నీకిఁకన్

సూత్రధారుండు నాటక పాత్రములను
గూర్చి యొడలించి క్రమ్మరఁ గూర్చునట్లు

కలిసియుండిన మనలను గడలఁద్రోసి
నలువురను గూర్చి దుదకిట్లు నలువ భళిర!

అన ననురూప సమ్మోదము
నందియు విన్నదనంబుఁ దోఁపఁ నా
యనుగుసుబుద్ధి యిట్టి సమ
యంబున నుండినఁగాదె పూర్ణతఁ
గనుమన సంతసంబు; వృథ
గాదె సఖీమణివైన దానితో
ననుభవ మందలేని ప్రమ
దాతిశయంబుఁ దలంప భారతీ.

అనిన మతిమంతుఁ "డేనెసుమా! సుబుద్ధి"
ననిచెలింగింప నాశ్చర్యమున మునింగి
యద్దిరా! యిదియెంత పుణ్యంబటంచుఁ
దనిసి యనురూప నిజము గన్గొనఁదలంప.

లోనికరిగి తొంటి మానినిరూపంబు
తోడ నాసుబుద్ధి తోఁచుటయును
చెలువలామెఁ గౌఁగిళులఁ జేర్చి యలరిరి
వింత రత్నవర్మ వెలఁదిఁ గనియె.

అనురూపాసతి యాసుబుద్ధిఁ గని చె
ల్వా! నీవు నాయొద్దఁ జే
సిన పంతంబును దీర్చికొంటివిగదా?
సేబాసు! నీవంటిదా

నిని నాయాత్మసఖీ లలామముగఁ గం
టిన్ ధన్యతం బొందితిన్
ననుఁ బోలంగల వారలుండరని యా
నందంబునం బొంగినన్.

భారతియున్ సఖీమణిని
బ్రస్తుతిఁజేసి లతాంగి! యప్పుడే
తీరున నీయనుంగుపడ
తిన్ విడనాడి తొలఁగి యెట్లు లీ
ధారుణినాథుఁ జేరితివి?
తత్కథ సర్వముఁ దెల్పుమన్న న
వ్వారిజగంధి యిట్లనియె
వారలకుం బ్రమదంబుఁ గూర్చుచున్.

◆ ◆ ◆

పూర్వోత్తరాగ్రము:

అపుడనురూపతోఁ బ్రతిన
లాడి క్రమంబున నెట్టులైన నా
నృపతిని దెత్తునంచు మది
నెంచుచు నద్దమరేయివేళ నా
నెపమున నీమెఁ బాసి చని
నేనొక పూరుష వేషమూని ని
ష్కపటమతిన్ బ్రతాపపురిఁ
గన్గొని యీతని చెల్మి చేసితిన్.

ఇతఁడు వారకాంతయే తనప్రాణంబు
ధనము రాజ్య మనుచుఁ దలఁచుచుండి
నిరతమును ధనంబు దొరలించుచుండుటఁ
గాంచి యొప్ప కొక్క కాలమందు.

మంత్రివరులఁ జేరి మంతనంబునఁ బిల్చి
చదురుజేసి "యేల చతురులార!
యూరకుంటి రిట్టులుర్వీధవుఁడు సిరి
వేదురెత్తి కొల్లవెట్టుచుండ.

ధారుణి జనులకు నృపుఁడా
ధారం డగుఁగాన నతని ధర్మజ్ఞునిగాఁ
గోరుదు రట్టిఁడ ప్రభుఁడని
గౌరవమున్ బడయుఁ; దగవు గలదే? యితనికిన్.

నిను రాజుగాఁగఁ బృథివీ
జను లోపక యుండి రింకఁ జాలును వారాం
గనఁ జేరుమనుచు నొక నెప
మున గుంజుకొనుండు రాజ్యమున్ బలిమిమెయిన్.

అని యాతని కుపకారం
బును గూర్పఁగ వారి కట్లు బోధించిన నా
నని యట్లుసేయ రాజ్యం
బును బాసిన యితనితోడఁ బోవుచు నొకచోన్.

నను గిరుకువెట్టి చనునీ
మనుజవిభుని నెట్లుగాంతు మాయురె! యని నె

ప్రశ్నమునఁ గలంత నొందుచు
గనుఁగొన వచ్చితి యీశ్రీకాకుళమునకున్.
మాణిభద్రుఁ డెంతో మర్యాద గలవాఁడ
టంచు రత్నవర్మ కాప్తుఁ డనుచు
నెఱిఁగి యెల్లచరిత మెఱిఁగించి యందుండ
వచ్చె నితఁడు కొన్ని వారములకు.

నరపతిఁగూడి భారతియొ
నందుఁడో చూతముగా కటంచువా
రరుదుగ వాదులాడు సమ
యంబునఁ బల్లియఁ జేరినాఁడు ము
వ్వరమును బూరుపాకృతులఁ
బూనఁగ నెంచుట దోఁచి భారతీ
తరుణియె యిట్టులుండుఁ జెలి
దగ్గఱ నంచును వీనిఁ దెచ్చితిన్.

పురుషకారంబునకు దైవము ఘటిల్లి
మంచికాలము రా సమీపించునపుడు
మనుజు లొనరించుకొద్ది యోచనలుగూడ
నెంతో మేలొనగూర్చుట కిదియె సాక్షి.

♦ ♦ ♦

సర్వాగ్రము :

ఈవిధి నొండొరుల్ తమ య
భీప్సితసిద్ధికి మూలమైన ప్ర

స్త్రావకథావిధాన మవ
ధానము సేయుచు నద్భుతప్రమో
దావిలచిత్తులై మెలఁగు
నంతఁ దదీయ విపత్పరంపరా
భావముఁబోలె రేచనఁ బ్ర
భాతముదోఁచె ననంతరంబునన్.

పురజను లీయద్భుతరస
భరితం బగుచరిత మెఱిఁగి పరమానందా
దరమేదురమతిఁ బొగడిరి
తరుణిం దత్పతుల ధర్మ తత్పరమతులన్.

అది విని మాణిభద్రుఁడు ము
దాతిశయంబునఁ బొంగి నెచ్చెలిం
గదియఁగ వచ్చి వానివల
నన్ శుభసంగతమైన యక్కథన్
మొదలిటినుండియున్ విని య
పూర్వ మదృష్టము మీసమాగమం
బిదియని ప్రస్తుతించి యతఁ
డెల్లరఁ దోడ్కొని యేగె నింటికిన్.

విందులు గుడుచుచు వారా
మందిరమున నుండ నతని మంత్రు లెఱిఁగి యా
నందంబునఁ జనుదెంచి ర
మందగతిన్ రత్నవర్మ మన్ననఁ బడయన్.

వారల నాప్రతాపజన
పాలుఁడు సాదర గౌరవంబులన్
జేరఁగఁదీసి మన్ననలు
జేసి యెఱుంగఁగవచ్చె మీర లా
తీరునఁ జేసినార మని
దీనతఁ బొందకుం డంచుఁ దెల్పి యా
కూరిమి మిత్రులో నతని
కోమలితోఁ బరివార యుక్తుఁడై.
కతిపయ వాసరములకుం
బ్రతాపపురిఁ జేరి పట్టభద్రుండగుచున్
సతి యనురూపాంగనతో
క్షితి నేలుచుఁ దన్ను ప్రజలు చేరి నుతింపఁగ.
మాణిభద్రు నతని మానిని మణిమాల
నెన్నరాని ప్రేమఁ గొన్నినాళ్ళు
తనదు మందిరమునఁ దనిపి కృతజ్ఞత
నెఱుఁగఁ జెప్పి కానుక లిచ్చి యనిపి.
తనరాజ్యమున వారతరుణీ విహారంబు
పొడచూప రాకుండఁ బొందు సేయ
తనయేలుబడిని తుంటరి మార్గములఁ బోవు
ద్యూతకారులపెంపు దొలఁగఁ జేయ
తన పరిపాలనంబున నేకపత్నీవ్రత
తము పూరుషులకు ధర్మముగఁ జేయ
తనయధికారంబునను మహిళాకళా
భ్యుదయంబు నెల్లెడఁ బొదలఁ జేయఁ

దలపుఁగొని యెల్లఁవిధముల మెలవులోడఁ
బొలుపునం దనమతమును నిలుపుకొనుచుఁ
దలపుఁబడి రాజులెల్ల మొక్కలపుఁ బ్రేమఁ
దెలుపుకొన రాజ్యలక్ష్మిపై వలపునిలిపి.
కరము కరముఁ గొనక కడు కృపామతితోన
నేల నేల సాధుశీలముననుు
బ్రజలు ప్రజలు వోలెఁ బ్రభుభక్తియుతులైరి
రాజు రాజువోలెఁ దేజరిల్లె.

♦ ♦ ♦

గద్య పద్యము :

బాలాంత్ర కులచైత్ర వనపారి జాతుండు,
వోలేటి వంశపయోధి విధుఁడు
నారసింహామాత్య నందనుం, డచ్యుత
రామమంత్రీశ్వర ప్రథమ సుతుఁడు
[illegible]ారమాంబాగర్భ శుక్తి ముక్తామణి,
వేంకమాంబాదాన విమలఫలము
అమల ధనాభి రామాదినాటకకర్త,
స్వర్ణమలాదిరూప కవిధాత
యైన వేంకట పార్వతీశాఖ్య సత్క
విద్వితయకృతల సమాన విపులపద్య
లలిత "చిత్రకథాసుధాలహరి" నామ
చిత్రితరకల్పనాకావ్య శేఖరమిది.

సమగ్రము.

